శ్రీరస్తు

## శ్రీ కృష్ణాష్టమీ వ్రతకల్పము - పూజావిధానము

ఇంటిలో ఈశాన్య మూలలో స్థలమును శుద్ధి చేసి, అలికి, బియ్యపు పిండితోగాని, రంగుల చూర్ణములతో గాని, ముగ్గులు పెట్టి, దైవస్థాపన నిమిత్తమై ఒక పీటను వేయాలి. పీట మరీ ఎత్తుగాగాని, మరీ పల్లముగా గానీ ఉండకూడదు. పిదప ఆ పీటకు కూడా చక్కగా పసుపురాసి, కుంకుమతో బొట్టుపెట్టి, వరి పిండి (బియ్యపుపిండి) తో ముగ్గు వేయాలి. సాధారణంగా అష్టదళపద్మాన్నే వేస్తారు. పూజ చేసేవారు తూర్పుముఖంగా కూర్చోవాలి. ఏ దైవాన్ని పూజింజబోతున్నారో ఆ దైవంయొక్క ప్రతిమనుగాని, చిత్రపటమునుగాని ఆ పీటపై ఉంచాలి. ముందుగా పసుపుతో గణపతిని తయారు చేసి (పసుపును షుమారు అంగుళం సైజులో త్రికోణ ఆకృతిలో ముద్దగాచేసి), దానికి కుంకుమ బొట్టు పెట్టి, పిదప ఒక పళ్ళెంలోగాని, క్రొత్త తుండుగుడ్డమీదగాని బియ్యం పోసి దానిపై ఒక తమలపాకునుంచి, అందు పసుపు గణపతినుంచి అగరువత్తులు వెలిగించాలి. ఇపుడు పూజకు కావలసిన వస్తువులను అమర్చుకోవాలి. దీపారాధన నైఋతి దిశలో చేయవలెను.

**పూజకు కావలసిన వస్తువులు-విధానము** :దీపారాధన చేయుటకు కుంది (ప్రమిద) వెండిదిగాని, ఇత్తడిదిగాని, మట్టిదిగాని వాడవచ్చును. కుందిలో 3 అడ్డవత్తులు 1 కుంభ వత్తి (మధ్యలో) వేసి నూనెతో తడుపవలెను. ఇంకొక అడ్డవత్తి నూనెతో తడిపి ఏకహారతిలో (కర్పూర హారతికి వాడే వస్తువు) వేసి ముందుగా ఏకహారతిలో వేసిన వత్తిని అగ్గిపుల్లతో వెలిగించి, వెలిగించిన వత్తితో కుందిలోని 1 అడ్డవత్తి 1 కుంభవత్తి వెలిగించవలెను. తర్వాత చేయి కడుక్కుని నూనె కుంది నిండావేసి పిదప ఆ కుందికి మూడు చోట్ల కుంకుమ అలంకారము చేయవలెను. తర్వాత అక్షతలు వేసి దీపారాధనను లక్ష్మీస్వరూపముగా భావించి నమస్కారము చేయవలెను. కుందిలో మిగిలిన రెండు అడ్డవత్తులు పూజా సమయంలో ధూపము చూపిన తరువాత దీపము చూపించుటకు వాడవలెను.దీపారాధనకు నువ్వులనూనెగాని, కొబ్బరినూనెగాని, ఆవునెయ్యిగాని వాడవచ్చును. మనము ఆచమనము చేసినటువంటి పంచపాత్రలోని నీళ్లు దేవుని పూజకు వినియోగించరాదు. పూజకు విడిగా ఒకగ్లాసుగాని, చెంబుగాని తీసుకొని దానిలో శుద్ధ జలమును పోసి ఆ చెంబునకు కలశారాధన చేసి ఆ నీళ్లు మాత్రమే దేవుని పూజకు ఉపయోగించవలెను.

శ్రీరస్తు

### శ్రీ కృష్ణాష్టమీ వ్రతకల్పము - పూజావిధానము

**శ్రీ కృష్ణుని వ్రతపూజకు కావలసిన ముఖ్య వస్తువులు :** కృష్ణుని బొమ్మ (శక్తి కొలది బంగారం, వెండి లేదా మట్టిబొమ్మ) లేదా చిత్రపటము, పువ్వులు, కొబ్బరికాయలు, పళ్లు, పసుపు, కుంకుమ, గంధం, హారతి కర్పూరం, అక్షతలు, అగ్గిపెట్టె, అగరువత్తులు, వస్త్ర, యజ్ఞోపవీతములు, నివేదనకు అటుకులు, బెల్లం, వెన్న, ప్రత్యేకముగా చేసిన పిండివంటలు (కృష్ణునికి ఇష్టమైన పదార్థములు జంతికలు, బియ్యంపిండితో చేసిన పాలకాయలు మొ॥వి) సిద్ధము చేసుకొనవలెను.

పిమ్మట యజమానులు (పూజచేసేవారు) ఈ దిగువ కేశవనామాలను స్మరిస్తూ ఆచమనం చేయాలి. ఈ నామములు మొత్తం 24 కలవు.

1. 'ఓం కేశవాయ స్వాహా' అని చెప్పుకుని చేతిలో నీరు తీసుకొని లోనికి తీసుకోవాలి.
2. 'ఓం నారాయణాయ స్వాహా' అనుకుని ఒకసారి
3. 'ఓం మాధవాయ స్వాహా' అనుకుని ఒకసారి జలమును పుచ్చుకోవలెను. తరువాత
4. 'ఓం గోవిందాయ నమః' అని చేతులు కడుగుకోవాలి.
5. 'విష్ణవే నమః' అనుకుంటూ నీళ్ళు త్రాగి, మధ్య వ్రేలు, బొటనవ్రేళ్లతో కళ్లు తుడుచుకోవాలి.
6. 'ఓం మధుసూదనాయ నమః' అని పై పెదవిని కుడినుంచి ఎడమకి నిమురుకోవాలి.
7. 'ఓం త్రివిక్రమాయ నమః' క్రింది పెదవిని కుడినుంచి ఎడమకి నిమురుకోవాలి.

8,9. 'ఓం వామనాయ నమః' 'ఓం శ్రీధరాయ నమః' ఈ రెండు నామాలు స్మరిస్తూ తలపై కొంచెం నీళ్లు చల్లుకోవాలి.

10. ఓం హృషీకేశాయ నమః ఎడమ చేతితో నీళ్లు చల్లాలి.
11. ఓం పద్మనాభాయ నమః పాదాలపై ఒక్కొక్క చుక్క నీరు చల్లుకోవాలి.
12. ఓం దామోదరాయ నమః శిరస్సుపై జలమును ప్రోక్షించుకోవలెను.
13. ఓం సంకర్షణాయ నమః చేతివ్రేళ్లు గిన్నెలా వుంచి గడ్డము తుడుచుకోవలెను.
14. ఓం వాసుదేవాయ నమః వ్రేళ్లతో ముక్కును వదులుగా పట్టుకోవలెను.

15,16. ఓం ప్రద్యుమ్నాయ నమః ఓం అనిరుద్ధాయ నమః నేత్రాలు తాకవలెను.

17,18. ఓం పురుషోత్తమాయ నమః ఓం అధోక్షజాయ నమః రెండు చెవులూ తాకవలెను.

19,20. ఓం నారసింహాయ నమః ఓం అచ్యుతాయ నమః బొడ్డును స్పృశించవలెను.

శ్రీరస్తు

శ్రీ కృష్ణాష్టమీ వ్రతకల్పము - పూజావిధానము

21. ఓం జనార్దనాయ నమః చేతివ్రేళ్లతో వక్ష స్థలం, హృదయం తాకవలెను.

22. ఓం ఉపేంద్రాయ నమః చేతి కొనతో శిరస్సు తాకవలెను.

23,24.ఓం హరయే నమః ఓం శ్రీకృష్ణాయ నమః కుడి మూపురమును ఎడమ చేతితోను, ఎడమ మూపురమును కుడిచేతి ఆచమనము చేసిన తరువాత ఆచమనము చేసి, వెంటనే సంకల్పము చెప్పుకోవలెను. ఆచమనము అయిన తరువాత, కొంచెం నీరు చేతిలో పోసుకుని నేలపై చిలకరించుతూ ఈ శ్లోకము పఠించవలెను.

శ్లో॥ ఉత్తిష్ఠంతు భూత పిశాచాః యేతే భూమిభారకాః
యేతేషామవిరోధేన బ్రహ్మకర్మ సమారభే ॥

ప్రాణాయామమ్య : ఓం భూః - ఓం భువః ఓం సువః - ఓం మహః - ఓం జనః ఓం తపః - ఓగ్ ం సత్యం - ఓం తత్ సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహీధియోయోనః ప్రచోదయాత్ - ఓం ఆపోజ్యోతిరసోమృతం బ్రహ్మ భూర్భువస్సువరోం అని సంకల్పము చెప్పుకొనవలెను.

సంకల్పము : మమ ఉపాత్త సమస్త దురితక్షయ ద్వారా శ్రీ పరమేశ్వర ముద్దిశ్య శ్రీపరమేశ్వర ప్రీత్యర్థం శుభే శోభన ముహూర్తే ఆద్య బ్రహ్మణః (ఇక్కడ శ్రీ మహావిష్ణో రాజ్ఞయా అని కూడా చెప్పవచ్చు) ద్వితీయ పరార్థే శ్వేత వరాహ కల్పే వైవస్వత మన్వంతరే కలియుగే ప్రథమపాదే జంబూ ద్వీపే భరతవర్షే భరత ఖండే మేరోర్దక్షిణ దిగ్భాగే శ్రీశైలస్య ఈశాన్య ప్రదేశే (మనకు శ్రీశైలము ప్రధాన క్షేత్రము కావున మనము శ్రీశైలమునకు ఏ దిక్కున ఉన్నామో ఆ దిక్కు చెప్పుకొనవలెను), కృష్ణా గోదావర్యోః మధ్యప్రదేశే (మనం ఏఏ నదులకు మధ్యన ఉన్నామో ఆయా నదుల పేర్లు చెప్పుకొనవలెను), శోభన గృహే (అద్దె ఇల్లు అయినచో వసతిగృహే అనియు, సొంత ఇల్లయినచో స్వగృహే అనియు చెప్పుకొనవలెను), సమస్తదేవతా బ్రాహ్మణ హరిహర సన్నిధౌ అస్మిన్ వర్తమానే వ్యావహారిక చాంద్రమానేన .......సంవత్సరే, (ఇక్కడ తెలుగు సంవత్సరమును అంటే పూజ చేయునపుడు ఏ సంవత్సరము జరుగుచున్నదో ఆ సంవత్సరము యొక్క పేరును చెప్పుకోవలెను), ........అయనే, (సంవత్సరమునకు రెండు అయనములు-ఉత్తరాయణము, దక్షిణాయనము.

జనవరి 15 మకర సంక్రమణం మొదలు జూలై 14 కర్కాటక సంక్రమణం వరకు ఉత్తరాయణము, జూలై 15 కర్కాటక సంక్రమణం నుండి మరల జనవరి 14 పెద్దపండుగ అనగా మకర సంక్రమణం వరకు దక్షిణాయనం. పూజచేయునపుడు ఏ అయనము జరుగుచున్నదో దానిని చెప్పవలెను) ...... ఋతుః, (వసంత, గ్రీష్మ, వర్ష మొ॥ ఋతువులలో పూజ సమయములో జరుగుచున్న ఋతువు పేరు) ........మాసే, (చైత్ర, వైశాఖ మొ॥ పన్నెండు మాసములలో పూజ సమయములో జరుగుచున్న మాసం పేరు) .....పక్షే, (నెలకు రెండు పక్షములు పౌర్ణమికి ముందు శుక్లపక్షము, అమావాస్యకు ముందు కృష్ణపక్షములు వీటిలో పూజ జరుగుచున్న సమయమున గల పక్షము పేరు) .....తిథౌ, (ఆరోజు తిథి) ....వాసరే (ఆరోజు ఏ వారమనదీ చెప్పుకొని) శుభనక్షత్రే, శుభయోగే, శుభకరణే ఏవం గుణ విశేషణ విశిష్ఠాయాం శుభతిథౌ మమ ఉపాత్త సమస్త దురితక్షయద్వారా శ్రీ పరమేశ్వర ముద్దిశ్య శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం పురుషులైనచో శ్రీమాన్ ....... గోత్రస్య..... నామధేయః, శ్రీమత్యః, గోత్రస్య, నామధేయస్య అనియు, స్త్రీలైనచో శ్రీమతి, గోత్రవతి,నామధేయవతి,శ్రీమత్యాః, గోత్రవత్యాః, నామధేయవత్యాః అనియు (పూజచేయువారి గోత్రము, నామము చెప్పి) నామధేయస్యః ధర్మపత్నీ సమేతస్య (పురుషులైనచో) మమ సహకుటుంబస్య, క్షేమ స్థైర్య వీర్య విజయ అభయ ఆయురారోగ్య ఐశ్వర్యాభి వృద్ధ్యర్థం, ధర్మార్థ కామ మోక్ష ఫలపురుషార్థ సిద్ధ్యర్థం, పుత్రపౌత్రాభి వృద్ధ్యర్థం సకలవిధ మనోవాంఛాఫలసిద్ధ్యర్థం, శ్రీ కృష్ణపరమాత్మ దేవతా ముద్దిశ్య కృష్ణపరమాత్మ దేవతా ప్రీత్యర్థం (ఏ దేవుని పూజించుచున్నామో ఆదేవునియొక్క పేరు చెప్పుకొని) సంభవద్భిరుపచారైః సంభవతానియమేన సంభవతా ప్రకారేణ యావచ్ఛక్తి (నాకు తోచిన రీతిలో, నాకు తోచిన నియమములతో, నాకు తోచిన విధముగా, భక్తి శ్రద్ధలతో సమర్పించుకొంటున్న పూజ) ధ్యానావాహనాది షోడశోపచార పూజాం కరిష్యే. తథంగ కలశపూజాం కరిష్యే ॥ పిదప కలశారాధనను చేయవలెను.

కలశపూజను గూర్చిన వివరణ : వెండి, రాగి, లేక కంచు గ్లాసులు (లేదా పంచపాత్రలు) రెండింటిలో శుద్ధ జలమును తీసుకొని ఒకదానియందు ఉద్ధరిణిని, రెండవదానియందు అక్షతలు, తమలపాకు, పువ్వు ఉంచుకొనవలెను. రెండవపాత్రకు బయట మూడు వైపులా గంధమును వ్రాసి కుంకమను అద్దవలెను. ఇట్లు చేయునపుడు గ్లాసును గుండ్రముగా త్రిప్పుచూ గంధమును గాని, కుంకుమనుగాని పూయరాదు.

గంధమును ఉంగరపు వేలితో పూయవలెను. కుంకుమ అక్షతలు వగైరా బొటన, మధ్య, ఉంగరపు వ్రేళ్లను కలిపి సమర్పించవలెను.యజమానులు(ఒక్క రైతేఒకరు, దంపతులైతే ఇద్దరూను) ఆ కలశాన్ని కుడిచేతితో మూసివుంచి, ఇలా అనుకోవాలి. ఈ విధముగా కలశమును తయారుచేసి పూజను చేయునపుడుమొదటగా ఈ శ్లోకమును చదువవలెను.

మం॥ కలశస్య ముఖే విష్ణుః కంఠే రుద్రస్సమాశ్రితః
మూలే తత్ర స్థితో బ్రహ్మామధ్యేమాతృ గణాస్మృతాః ॥
ఋగ్వేదో థ యజుర్వేదస్సామవేదోహ్యధర్వణః
అంగైశ్చ సహితాస్సర్వే కలశాంబు సమాశ్రితాః
శ్లో॥ గంగైచ యమునేచైవ కృష్ణే, గోదావరి, సరస్వతీ, నర్మదా సింధు
కావేర్యా జలేస్మిన్ సన్నిధిం కురు ॥

ఇక్కడ ఇలా శ్లోకము ముగిసిన తరువాత ఆయాతు శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః (ఏ దేవుని పూజైతే చేస్తున్నామో ఆ దేవుని పేరును చెప్పవలెను) పూజార్థం మమ దురితక్షయకారకాః కలశోదకేన ఓం దేవం సంప్రోక్ష్య (కలశమందలి ఉదకమును దేవునిపై చల్లాలి), ఓం ఆత్మానం సంప్రోక్ష్య అని (ఆ నీటిని తనపై చల్లుకోవాలి) ఓం పూజా ద్రవ్యాణి సంప్రోక్ష్య (పూజాద్రవ్యములపై కూడా చల్లాలి) కలశమందలి నీటిని పై మంత్రం చదువుతూ పువ్వుతోగాని, ఆకుతోగానీ చల్లాలి.

మార్జనము : ఓం అపవిత్రః పవిత్రోవా సర్వావస్థాంగతోపివా
యస్స్మరే త్పుండరీకాక్షం సబాహ్యాభ్యంతరశ్శుచిః ॥

అని పిదప కాసిని అక్షతలు, పసుపు, గణపతిపై వేసి, ఆయనను తాకి నమస్కరించి ప్రాణప్రతిష్ఠాపన చేయవలెను. ప్రాణప్రతిష్ఠ అనగా శ్రీ మహాగణాధిపతయేనమః ప్రాణప్రతిష్ఠాపన ముహూర్తస్సుముహూర్తోస్తు తథాస్తు. తరువాత ఇలా చదువుతూ విఘ్నేశ్వరునికి నమస్కరించవలెను.

శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్
ప్రసన్నవదనం ధ్యాయే త్సర్వవిఘ్నోపశాంతయే ॥
సుముఖశ్చైక దంతశ్చ కపిలో గజకర్ణకః
లంబోదరశ్చ వికటో విఘ్నరాజో వినాయకః
ధూమకేతు ర్గణాధ్యక్షః ఫాలచంద్రో గజాననః

వక్రతుండ శ్శూర్పకర్ణో హేరంబః స్కంధపూర్వజః
షోడశైతాని నామాని యఃపఠేచ్ఛృణుయాదపి
విద్యారంభే వివాహేచ ప్రవేశే నిర్గమే తథా
సంగ్రామే సర్వకార్యేషు విఘ్నస్తస్య నజాయతే ॥

అని ప్రార్థించి పిమ్మట కృష్ణునికి షోడశోపచార పూజను చేయవలెను. షోడశోపచారములనగా ఆవాహన, ఆసనం, అర్ఘ్యం, పాద్యం, ఆచమనీయం, స్నానం, వస్త్రం, యజ్ఞోపవీతం, గంధం, పుష్పం, ధూపం, దీపం, నైవేద్యం, తాంబూలం, నమస్కారం, ప్రదక్షిణములు మొదలగునవి.

**అథ షోడశోపచార పూజాః**

**ధ్యానం**

శ్లో॥ శ్రీకృష్ణగోపీజన ముఖ్యవిష్ణో బ్రహ్మాండకుక్షింభర వాసుదేవ ।
గోపీసహస్ర షోడశవల్లభాఖ్య, గోవిందపీతాంబర శంఖచక్రిన్॥
ఏవంధ్యాత్వా హరింసమ్యక్ శ్రీకృష్ణః విశ్వరూపిణం
ఇష్టకామ్యార్థ సిద్ధ్యర్థం పూజాం కుర్యాద్యథావిధి ॥

ఓం శ్రీ కృష్ణాయ నమః ధ్యాయామి - ధ్యానం సమర్పయామి అని శ్రీకృష్ణుని మనస్సున ధ్యానించి నమస్కరించవలెను.

**ఆవాహనం :** శ్లో॥ ఆవాహయామి దేవేశ సిద్ధ గంధర్వ సేవితః
యద్రహస్యమిదం పుణ్యం సర్వపాపహరోహరిః ॥

ఓం శ్రీ కృష్ణాయ నమః ఆవాహయామి. ఆవాహనార్థం అక్షతాం సమర్పయామి. అనగా మనస్ఫూర్తిగా దేవుని మన ఇంట్లోకి ఆహ్వానించడం. అట్లు మనస్సున స్మరిస్తూ అక్షతలు దేవునిపై వేయవలెను.

**ఆసనం :** శ్లో॥ దేవదేవ జగన్నాథా ప్రణతక్లేశనాశన,
రత్నసింహాసనం దివ్యం గృహాణమధుసూదన ॥

ఓం శ్రీ కృష్ణాయ నమః నవరత్న ఖచిత సింహాసనం సమర్పయామి. సింహాసనార్థం అక్షతాం సమర్పయామి. దేవుడు కూర్చుండుటకై మంచి బంగరుపీట వేసినట్లు అనుకుంటూ అక్షతలు వేయవలెను.

**అర్ఘ్యం :** శ్లో॥ కురుష్వమేదయాన్దేవ సంసారార్తి భయాపహ
దధిక్షీరజలోపేతం గృహాణర్ఘ్యం నమోస్తుతే ॥

ఓం శ్రీ కృష్ణాయ నమః హస్తౌః అర్ఘ్యం సమర్పయామి. దేవుడు చేతులు కడుగుకొనుటకై నీళ్ళిస్తున్నామని మనసున తలుస్తూ, ఉద్ధరిణితో నీరు వేరొక గిన్నెలో వదలవలయును.

పాద్యం : శ్లో॥ లాంఛితం కురుమేదేవ దుష్కృతంచ వినాశయ
పాద్యం గృహాణ భగవన్ మాతురుత్సంగ సంస్థిత ॥

ఓం శ్రీ కృష్ణాయ నమః పాదౌః పాద్యం సమర్పయామి. దేవుడు కాళ్లు కడుగుకొనుటకు నీరు ఇస్తున్నామని మనసున అనుకుంటూ పువ్వుతో పంచపాత్రలోని నీరు అదే గిన్నెలో ఉద్ధరిణెతో వదలవలెను.

ఆచమనీయం : శ్లో॥ శ్రీవత్సాంక జగద్రూప శ్రీధరశ్రీనికేతన
ఉపేంద్ర దేవకీపుత్ర గృహాణాచమనీయకం ॥

ఓం శ్రీ కృష్ణాయ నమః ముఖే ఆచమనీయం సమర్పయామి. అంటూ దేవుని ముఖము కడుగుకొనుటకై నీళ్ళిస్తున్నామని మనమున తలుస్తూ పైన చెప్పిన పాత్రలో ఉద్ధరిణెతో ఒకమారు నీరు వదలవలెను.

సూచన : అర్ఘ్యం, పాద్యం, ఆచమనం మొదలగు వాటికి ఉద్ధరిణెతో నీరు వేరొక పాత్రలో వదలవలెను. అరివేణంలో వదలరాదు.

మధుపర్కం : శ్లో॥ గోపవేష నమస్తుభ్యం దధిక్షీరసమన్వితం
మధుపర్కం గృహాణేదం మయాదత్తంహికేశవ ॥

ఓం శ్రీ కృష్ణాయ నమః మధుపర్కం సమర్పయామి. స్వామివారికి స్నానం చేయుటకు వస్త్రమిచ్చుచున్నామని తలుస్తూ, ఈ మధుపర్కంను (ప్రత్తిని పెద్దబొట్టుబిళ్ళ సైజులో గుండ్రముగా చేసి నీటిలో తడిపి ఆపైన రెండువైపులా పసుపులో అద్ది ఉంచుకొనవలెను) ఆయన ప్రతిమకు అద్దవలెను.

పంచామృతస్నానం :

శ్లో॥ శర్వాయ స్వర్గపతయే గోవిందాయ మహాత్మనే
స్నానం పంచామృతందేవ గృహాణసరసత్తమ ॥

ఓం శ్రీ కృష్ణాయ నమః పంచామృత స్నానం సమర్పయామి అని స్నానమునకు పంచామృతములతో కూడిన నీరు ఇచ్చునట్లు భావించి ఆవునెయ్యి, ఆవుపాలు, ఆవు పెరుగు, తేనె, పంచదార కలిపిన పంచామృతమును స్వామిపై ఉద్ధరిణెతో చల్లవలెను.

శుద్ధోదక స్నానం : శ్లో॥ నారికేళోదకం గంగాయమునాది సముద్భవం
శుద్ధోదకం గృహాణేశ స్నానం కురుయథావిధి ॥

ఓం శ్రీ కృష్ణాయ నమః శుద్ధోదకస్నానం సమర్పయామి. పంచపాత్రలోని శుద్ధ నీటిని పువ్వుతోదేవునిపైచల్లవలెను.వస్త్రయుగ్మం:శ్లో॥శ్రీధరాయనమస్తుభ్యంవిష్ణవే పరమాత్మనే, పీతాంబర ప్రదాస్యామి వాసుదేవాయ నమోస్తుతే ॥

ఓం శ్రీ కృష్ణాయ నమః వస్త్రయుగ్మం సమర్పయామి అనుచు వస్త్రమును (పైన చెప్పినట్లు ప్రత్తిని గంధ్రని బిళ్ల ఆకారములో చేసి కుంకుమలో అద్దినచో అది వస్త్రమగును) స్వామివారి ప్రతిమకు అద్దవలెను.

యజ్ఞోపవీతం : శ్లో॥ బ్రహ్మసూత్రంచోపవీతం త్రయీనాథ ధరాధర,
గోవింద పరమానంద వాసుదేవాయతే నమః॥

ఓం శ్రీ కృష్ణాయ నమః ఉపవీతం సమర్పయామి అనగా జందెమును ఇవ్వవలెను. ఇదియును ప్రత్తితో చేయవచ్చును. ప్రత్తిని తీసుకొని పసుపుచేత్తో బొటన వ్రేలు, మధ్య వ్రేలితో మధ్య మధ్య నలుపుతూ పొడవుగా చేసి, కుంకుమ అద్దవలెను. దీనిని పురుషదేవతా పూజకు మాత్రమే సమర్పించవలెను.

సర్వాభరణాని : శ్లో॥ కేయూరవలయంచైవ గ్రైవేయం కుండలద్వయం
అంగుళీయక రత్నాభిభూషణానితుగృహ్యతాం ॥

ఓం శ్రీ కృష్ణాయ నమః సర్వాభరణం సమర్పయామి. శక్తి కొలది ఆభరణములను స్వామివద్ద వుంచి పూజించవలయును.

గంధం : శ్లో॥ చందనాగరుకర్పూర కస్తూరీ ఘనసార సమన్వితం,
గంధం గృహాణగోపాల నానాగంధాంశ్చధారయ ॥

ఓం శ్రీ కృష్ణాయ నమః గంధాన్ సమర్పయామి. ముందుగా తీసిపెట్టుకున్న గంధమును కుడిచేతిఉంగరంవ్రేలుతో4 లేదా 5 చుక్కలు పడునట్లు స్వామివారి ప్రతిమపై చల్లవలెను.

అక్షతాన్ : శ్లో॥ గోవింద పరమానంద హరిద్రాసహితాక్షతాన్,
విశ్వేశ్వర విశాలాక్షా గృహాణ పరమేశ్వర ॥

ఓం శ్రీ కృష్ణాయ నమః అక్షతాన్ సమర్పయామి. (అక్షతలు అనగా కొద్ది బియ్యమును తడిపి పసుపువేసి కలుపవలెను) అక్షతలు తీసుకొని స్వామివారి ప్రతిమపై చల్లవలెను.

పుష్ప పూజ : శ్లో॥ సామంతికావకుళ చంపక పాటలాబ్జపున్నాగ జాజి కరవేకరనాల పుష్పైః బిల్వప్రవాళ తులసీదళమల్లికాని త్వాపూజయామి జగదీశ్వర వాసుదేవ ॥

ఓం శ్రీ కృష్ణాయ నమః పుష్పాణి సమర్పయామి. స్వామివారికి పువ్వులతో అలంకరించి, పువ్వులతో పూజించవలయును.

పిదప శ్రీ కృష్ణునికి అథాంగపూజను చేయవలెను. ఈ క్రింది నామములను చదువుచు ఒక్కొక్క నామమునకు స్వామిపై అక్షతలు లేదా పసుపు లేదా కుంకుమను వేస్తూ పూజ చేయవలెను.

**అథాంగ పూజ**

ఓం శ్రీ త్రివిక్రమాయ నమః పాదౌ పూజయామి; ఓం శ్రీ గంగాప్రభవాయ నమః గుల్ఫౌ పూజయామి; ఓం శ్రీ విష్వక్సేనాయ నమః జంఘే పూజయామి; ఓం శ్రీ జనార్దనాయ నమః జానునీ పూజయామి; ఓం శ్రీ పీతాంబరాయ నమః ఊరూ పూజయామి; ఓం శ్రీ గరుడవాహనాయ నమః కటిం పూజయామి; ఓం శ్రీ లోకప్రభవాయ నమః గుహ్యం పూజయామి; ఓం శ్రీ పద్మనాభాయ నమః నాభిం పూజయామి; ఓం శ్రీ దామోదరాయ నమః ఉదరం పూజయామి; ఓం శ్రీ కౌస్తుభధారిణే నమః హృదయం పూజయామి; ఓం శ్రీ వనమాలినే నమః స్తనౌ పూజయామి; ఓం శ్రీ కంబుగ్రీవాయ నమః కంఠం పూజయామి; ఓం శ్రీ దివ్యాయుధాయ నమః స్కంధౌ పూజయామి; ఓం శ్రీ శార్ఙ్గపాణియే నమః బాహూ పూజయామి; ఓం శ్రీ శంఖచక్రధరాయ నమః హస్తౌ పూజయామి; ఓం శ్రీ చంద్రముఖాయ నమః ముఖం పూజయామి; ఓం శ్రీ దేవగర్భాయ నమః ఓష్ఠ పూజయామి ఓం శ్రీ ఉపేంద్రాయనమః ఘ్రాణం పూజయామి; ఓం శ్రీ పుండరీకాక్షాయ నమః నేత్రౌ పూజయామి; విష్ఠరశ్రవసేనమః కర్ణౌ పూజయామి; మాధవాయనమః లలాటం పూజయామి; సర్వాత్మనేనమః శిరః పూజయామి; దేవకీసూనవేనమః సర్వాంగణ్యాని పూజయామి.

అనంతరం 108 పేర్లు గల అష్టోత్తర శతనామావళితో స్వామిని పూజించవలెను. ఈక్రింది నామములను చదువుచు ఒక్కొక్క నామమునకు స్వామిపై అక్షతలు లేదా పసుపు లేదా కుంకుమను వేస్తూ పూజ చేయవలెను.

శ్రీ కృష్ణాష్టోత్తర శతనామావళి

ఓం కృష్ణాయ నమః
ఓం కమలనాథాయ నమః
ఓం వాసుదేవాయ నమః
ఓం సనాతనాయ నమః
ఓం వసుదేవాత్మజాయ నమః
ఓం పుణ్యాయ నమః
ఓం లీలామానుషవిగ్రహాయ నమః
ఓం శ్రీవత్సకౌస్తుభధరాయ నమః
ఓం యశోదావత్సలాయ నమః
ఓం హరిఃయే నమః ॥10॥
ఓం చతుర్భుజాత్తచక్రాసిగదా నమః
ఓం శంఖాంబుజాయుధాయుజాయ నమః
ఓం దేవకీనందనాయ నమః
ఓం శ్రీశాయ నమః
ఓం నందగోపప్రియాత్మజాయ నమః
ఓం యమునావేగసంహారిణే నమః
ఓం బలభద్రప్రియానుజాయ నమః
ఓం పూతనాజీవితహరాయ నమః
ఓం శకటాసురభంజనాయ నమః
ఓం నందవ్రజజనానందినే నమః ॥20॥
ఓం సచ్చిదానందవిగ్రహాయ నమః
ఓం నవనీతవిలిప్తాంగాయ నమః
ఓం నవనీతనటాయ నమః
ఓం ముచుకుందప్రసాదకాయ నమః
ఓం షోడశస్త్రీసహస్రేశాయ నమః
ఓం త్రిభంగినే నమః
ఓం మధురాకృతయే నమః
ఓం శుకవాగమృతాబ్ధీందవే నమః
ఓం గోవిందాయ నమః
ఓం యోగినాంపతయే నమః ॥30॥
ఓం వత్సవాటిచరాయ నమః
ఓం అనంతాయ నమః
ఓం ధేనుకాసురభంజనాయ నమః
ఓం తృణీకృతతృణావర్తాయ నమః
ఓం యమళార్జునభంజనాయ నమః
ఓం ఉత్తాలోత్తాలభేత్రే నమః
ఓం తమాలశ్యామలాకృతియే నమః
ఓం గోపగోపీశ్వరాయ నమః
ఓం యోగినే నమః
ఓం కోటిసూర్యసమప్రభాయ నమః ॥40॥
ఓం ఇలాపతయే నమః
ఓం పరంజ్యోతిషే నమః
ఓం యాదవేంద్రాయ నమః
ఓం యదూద్వహాయ నమః
ఓం వనమాలినే నమః
ఓం పీతవాసనే నమః
ఓం పారిజాతాపహారకాయ నమః
ఓం గోవర్ధనాచలోద్ధ ర్త్రే నమః
ఓం గోపాలాయ నమః
ఓం సర్వపాలకాయ నమః ॥50॥
ఓం అజాయ నమః
ఓం నిరంజనాయ నమః
ఓం కామజనకాయ నమః
ఓం కంజలోచనాయ నమః
ఓం మధుఘ్నే నమః

ఓం మధురానాథాయ నమః
ఓం ద్వారకానాయకాయ నమః
ఓం బలినే నమః
ఓం బృందావనాంతసంచారిణే నమః
ఓం తులసీదామభూషణాయ నమః ॥60॥
ఓం శమంతకమణేర్హర్త్రే నమః
ఓం నరనారాయణాత్మకాయ నమః
ఓం కుబ్జకృష్ణాంబరధరాయ నమః
ఓం మాయినే నమః
ఓం పరమపురుషాయ నమః
ఓం ముష్టికాసురచాణూర నమః
ఓం మల్లయుద్ధవిశారదాయ నమః
ఓం సంసారవైరిణే నమః
ఓం కంసారయే నమః
ఓం మురారయే నమః ॥70॥
ఓం నరకాంతకాయ నమః
ఓం అనాదిబ్రహ్మచారిణే నమః
ఓం కృష్ణావ్యసనకర్శకాయ నమః
ఓం శిశుపాలశిచ్ఛేత్రే నమః
ఓం దుర్యోధనకులాంతకాయ నమః
ఓం విదురాక్రూరవరదాయ నమః
ఓం విశ్వరూపప్రదర్శకాయ నమః
ఓం సత్యవాచే నమః
ఓం సత్యసంకల్పాయ నమః
ఓం సత్యభామారతాయ నమః ॥80॥
ఓం జయినే నమః
ఓం సుభద్రాపూర్వజాయ నమః
ఓం విష్ణవే నమః
ఓం భీష్మముక్తిప్రదాయకాయ నమః
ఓం జగద్గురువే నమః
ఓం జగన్నాథాయ నమః
ఓం వేణునాదవిశారదాయ నమః
ఓం వృషభాసురవిధ్వంసినే నమః
ఓం బాణాసురకరాంతకృతే నమః
ఓం యుధిష్ఠిర ప్రతిష్ఠాత్రే నమః ॥90॥
ఓం బర్హిబర్హావతంసకాయ నమః
ఓం పార్థసారథియే నమః
ఓం అవ్య క్తాయ నమః
ఓం గీతామృతమహోదధియే నమః
ఓం కాళీయఫణిమాణిక్యరంజిత
శ్రీపదాంబుజాయ నమః
ఓం దామోదరాయ నమః
ఓం యజ్ఞభోక్త్రే నమః
ఓం దానవేంద్రవినాశకాయ నమః
ఓం నారాయణాయ నమః
ఓం పరబ్రహ్మణే నమః ॥100॥
ఓం పన్నగాశనవాహనాయయ నమః

ఓం జలక్రీడాసమాసక్తగోపవస్త్రాపహారకాయ నమః

ఓం పుణ్యశ్లోకాయ నమః

ఓం తీర్థకృతే నమః

ఓం వేదవేద్యాయ నమః

ఓం దయానిధయే నమః

ఓం సర్వతీర్థాత్మకాయ నమః

ఓం సర్వగ్రహరూపిణే నమః

ఓం పరాత్పరాయ నమః ॥108॥

శ్రీ కృష్ణాష్టోత్తర శతనామావళి సంపూర్ణమ్

ధూపం:

పిదప అగరువత్తిని వెలిగించి......

శ్లో॥ దశాంగం గగ్గులోపేతం సుగంధం సుమనోహరం

ధూపం గృహాణ దేవేశ విఘ్నరాజ నమోస్తుతే ॥

ఓం శ్రీ కృష్ణాయ నమః ధూప మాఘ్రాపయామి. ధూపం సమర్పయామి అంటూ ఎడమచేత్తో గంట వాయిస్తూ కుడిచేత్తో అగరుబత్తిని తిప్పుతూ పొగను స్వామికి చూపవలెను. పిమ్మట మొదట్లో చెప్పిన విధంగా దీపారాధనలో వున్న అదనపు వత్తులలో ఒకదానిని తీసుకొని హారతి వెలిగించే దాంట్లో వేసి వెలిగించి గంట మ్రోగిస్తూ ఆ దీపం స్వామికి చూపుతూ.....

దీపం :

శ్లో॥ త్రిలోకేశమహాదేవ సర్వజ్ఞాన ప్రదాయక

దీపం దాస్యామిదేవేశ రక్షమాం భక్తవత్సల॥

ఓం శ్రీ కృష్ణాయ నమః సాక్షాత్ దీపం దర్శయామి అని మొదట్లో చెప్పిన విధంగా దీపారాధనలో వున్న అదనపు వత్తులలో ఒకదానిని తీసుకొని హారతి వెలిగించే దాంట్లో వేసి వెలిగించి గంట మ్రోగిస్తూ ఆ దీపం స్వామికి చూపుతూ పై శ్లోకమును చదువవలెను.

నైవేద్యం : శ్లో॥ సర్వభక్ష్యైశ్చ భోజ్యైశ్చరసైష్షడ్భిస్సమన్వితమ్

నైవేద్యంతుమయాసీతాం గృహాణ పురుషోత్తమ ॥

ఓం శ్రీ కృష్ణాయ నమః నైవేద్యం సమర్పయామి అని ఒక బెల్లం ముక్క, పళ్ళు, కొబ్బరికాయ, అటుకులు, స్వామికి ప్రత్యేకముగా చేసిన భక్ష్యములు మొదలగునవి స్వామివద్దనుంచి దానిపై పువ్వుతో నీళ్లు చల్లుతూ ఓం శ్రీ కృష్ణాయ నమః నైవేద్యం సమర్పయామి. 'ఓం ప్రాణాయ స్వాహా, ఓం అపానాయస్వాహా, ఓం వ్యానాయస్వాహా, ఓం ఉదానాయ స్వాహా, ఓం సమానాయ స్వాహా, ఓం శ్రీ వాసుదేవాయ నమః'అంటూ ఆరుమార్లు చేతితో (చేతిలోని ఉద్ధరిణితో) స్వామికి నివేదనం చూపించాలి. పిదప ఓం శ్రీ కృష్ణపరమాత్మనే నమః నైవేద్యానంతరం 'హస్తౌ ప్రక్షాళయామి'అని ఉద్ధరిణితో పంచపాత్రలోని నీరు ముందు చెప్పిన అర్ఘ్యపాత్ర (పంచపాత్ర కాకుండా విడిగా చెంబులో పెట్టుకొనే నీళ్ల పాత్ర) లో వదలాలి. తరువాత 'పాదౌప్రక్షాళయామి'అని మరోసారి నీరు అర్ఘ్య పాత్రలో ఉద్ధరిణితో వదలాలి. పునః శుద్ధాచమనీయం సమర్పయామి అని ఇంకొక పర్యాయం నీరు వదలాలి తదనంతరం ....

పూర్వాపోశనం :

శ్లో॥ సుధారసం సువిపులం మయానీతంతుమాధవ ।
గృహాణకలశానీతం యథౌష్ఠముపభుజ్యతాం॥

శ్రీ కృష్ణాయ నమః పూర్వాపోశనం సమర్పయామి అని భోజనమునకు ముందు పరిషం పట్టినట్లుగా భావించి పంచపాత్రలోని నీటిని ఉద్ధరిణతో నైవేద్యమునకు వుంచిన పదార్థములపై చల్లి స్వామికి చూపించవలెను.

మధ్యే పానీయం:

శ్లో॥ పానీయం పావనం శ్రేష్ఠ మల్లికాది సువాసితం
కర్పూర వాసితం తోయం ప్రీత్యర్థం మధుసూదన ॥

శ్రీ కృష్ణాయ నమః మధ్యే మధ్యే పానీయం సమర్పయామి అని భోజనము చేయునపుడు మధ్య మధ్య నీటిని ఇచ్చునట్లుగా భావించి మరొకసారి పంచపాత్రలోని నీటిని ఉద్ధరిణతో నైవేద్యమునకు వుంచిన పదార్థములపై చల్లి స్వామికి చూపించవలెను.

**ఉత్తరాపోశనం:**

శ్లో॥ ఉత్తరాపోశనంగ్రాహ్యం
హస్తప్రక్షాళనం కురుపాద ప్రక్షాళనం ॥

శ్రీ కృష్ణాయ నమః ఉత్తరాపోశనం సమర్పయామి అని భోజనం పూర్తి అయిన తరువాత కొంత జలమును తీసుకొని ఆకుచుట్టూ తిప్పి పరిశం పట్టినట్లుగా భావించి తరువాత శ్రీ కృష్ణాయ నమః ఉత్తరాపోశానంతరం 'హస్తౌ ప్రక్షాళయామి'అని ఉద్ధరిణెతో పంచపాత్రలోని నీరు ముందు చెప్పిన అర్ఘ్యపాత్ర (పంచపాత్ర కాకుండా విడిగా చెంబులో పెట్టుకొనే నీళ్ల పాత్ర) లో వదలాలి. తరువాత 'పాదౌప్రక్షాళయామి'అని మరోసారి నీరు అర్ఘ్య పాత్రలో ఉద్ధరిణెతో వదలాలి. పునః శుద్ధాచమనీయం సమర్పయామి అని ఇంకొక పర్యాయం నీరు వదలాలి.

తాంబూలం :

శ్లో॥ పూగీఫల సమాయుక్తం నాగవల్లీ దళైర్యుతం
ముక్తాచూర్ణ సమాయుక్తం తాంబూలం ప్రతిగృహ్యతాం ॥

శ్రీ కృష్ణాయ నమః తాంబూలం సమర్పయామి అని చెబుతూ మూడు తమలపాకులు, రెండు పోకచెక్కలు వేసి స్వామివద్ద ఉంచాలి. తాంబూలం వేసుకున్నాక నోరు కడుక్కొనుటకు నీరు ఇస్తున్నామని తలుస్తూ, 'తాంబూల చరవణానంతరం శుద్ధ ఆచమనీయం సమర్పయామి'అంటూ ఉద్ధరిణెతో నీరు అర్ఘ్యపాత్రలో వదలాలి.

పిమ్మట కర్పూరం వెలిగించి......

శ్లో॥ ఘృతవర్తి సహస్రైశ్చ కర్పూరశకలైస్తథా,
నీరాజనం మయాదత్తం గృహాణ వరదో భవ ॥

ఓం శ్రీ కృష్ణాయ నమః నీరాజనం సమర్పయామి అని కర్పూర బిళ్ళలు హారతి కుందిలో వేసి ముందుగా దీపారాధనకు వెలిగించిన దీపంతో వెలిగించి, మూడుమార్లు త్రిప్పుచూ, చిన్నగా గంట వాయించవలెను. అనంతరం మళ్లీ పువ్వుతో నీరు హారతి కుంది చివర వదులుతూ ' కర్పూర నీరాజనానంతరం శుద్ధాచమనీయం సమర్పయామి ' అని చెప్పి నీరాజనం స్వామివారికి చూపించి తరువాత ఇంటిలోని వారందరూ హారతిని కళ్ళకు అద్దుకోవాలి.

తరువాత అక్షతలు, పువ్వులు, చిల్లర డబ్బులు చేతితో పట్టుకొని,

సువర్ణపుష్పం : శ్లో॥ స్వర్ణపుష్ప మిదందేవ గృహాణ పురుషోత్తమ
కోటిసూర్య ప్రతీకాశం స్వర్ణపుష్పం మనోహరం

ఓం శ్రీ కృష్ణాయ నమః యథాశక్తి మంత్రపుష్పం సమర్పయామి అని చెప్పుకొని అక్షతలు, పువ్వులు, చిల్లర స్వామివద్ద ఉంచవలెను.

నమస్కారాన్ : శ్లో॥ శ్రీకృష్ణ సర్వలోకేశ నానాపుష్పైస్సురాజితైః
పుష్పాంజలిః ప్రదాశ్యామి గృహాణేశ మయార్పితమ్ ॥
ఓం శ్రీ కృష్ణాయ నమః నమస్కారం సమర్పయామి అని స్వామికి నమస్కరించవలెను.
ఈ దిగువ మంత్రం జపిస్తూ మూడుసార్లు ప్రదక్షిణలు చేయాలి.
ప్రదక్షిణం : శ్లో॥ దేవదేవ జగన్నాథా వాంఛితార్థ ఫలప్రద
ప్రదక్షిణం కరోమిత్వాం సంసారార్ణవ తారక ॥
శ్లో॥ యానికానిచ పాపాని జన్మాంతర కృతానిచ
తానితాని ప్రణశ్యంతి ప్రదక్షిణ పదేపదే ॥
ఓం శ్రీ కృష్ణాయ నమః ఆత్మ ప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి. చేతిలో అక్షతలు, పువ్వులు తీసుకొని లేచి నిలబడి మూడు సార్లు ఆత్మప్రదక్షిణ చేసి (అనగా తమలో తాము చుట్టూ తిరిగి) చేతిలో వున్న అక్షతలు మొదలగునవి స్వామిపై వేయవలెను.
సాష్టాంగ నమస్కారాన్ :
శ్లో॥ కృష్ణాయ వాసుదేవాయ దేవకీ నందనాయచ
నందగోప కుమారాయ గోవిందాయ నమోనమః
ఓం శ్రీ కృష్ణాయ నమః సాష్టాంగ నమస్కారం సమర్పయామి అని స్వామికి సాష్టాంగ నమస్కారం (మగవారు పూర్తిగా పడుకుని తలను నేలకు ఆన్చి, ఆడువారు మోకాళ్లపై పడుకుని కుడికాలు ఎడమకాలుపై వేసి) చేయవలెను. తరువాత స్వామిపై అక్షతలు, పువ్వులు చల్లవలెను. మరల తమ స్థానమున ఆసీనులై నమస్కరించుచూ ....
ప్రార్థన : శ్లో॥ అపరాధన సహస్రాణి క్రియతేహర్నిశంమయా । దాసాహమితిమాఃమత్వా క్షమస్వ పురుషోత్తమా ॥ తతో గంధాక్ష తైః పుష్పైః పూజయేచ్చంద్రమండలం । తత్రార్ఘ్య పాత్రం నిక్షిప్య అర్ఘ్యే ద్రవ్యాణి నిక్షిపేత్ । జ్యోతిష్మతే నమస్తుభ్యం నమస్తే జ్యోతిషాంపతే । నమస్తే రోహిణీకాంత సుధాకర నమోస్తుతే చంద్రప్రార్థన మంత్రః జాతః కంసవధార్థాయ భూభారోత్తారణాయచ । దానవానాం వినాశాయ వసుదేవకులోద్భవ । శ్రీకృష్ణాయనమః ప్రథమార్ఘ్యం సమర్పయామి పాండవానాంహితార్థాయ ధర్మ సంస్థాపనాయచ । కౌరవానాం వినాశాయ వసుదేవ కులోద్భవ । శ్రీకృష్ణాయనమః ద్వితీయార్ఘ్యం సమర్పయామి శ్రావణ్యాం కృష్ణపక్షేతు అష్టమీ రోహిణీయుతాతస్యాం చంద్రోదయే రాత్రౌ బాలకృష్ణ సముద్భవః

శ్రీకృష్ణాయనమః తృతీయార్ఘ్యం సమర్పయామి క్షీరోదార్ణవ సంభూత అత్రినేత్ర సముద్భవ । గృహాణార్ఘ్య మయాదత్తం రోహిణ్యా సహితశ్శశిన్ శ్రీకృష్ణాయనమః చంద్రార్ఘ్యం యస్యస్మృత్యాచం వ్రతం సువ్రతమస్తు ।

పునఃపూజ : ఓం శ్రీ కృష్ణాయ నమః పునఃపూజాంచ కరిష్యే అని చెప్పుకొని, పంచపాత్రలోని నీటిని చేతితో తాకి, అక్షతలు స్వామిపై చల్లుతూ ఈక్రింది మంత్రములు చదువుకొనవలెను.

ఛత్రం ఆచ్ఛాదయామి, చామరం వీజయామి, నృత్యం దర్శయామి, గీతం శ్రావయామి. సమస్త రాజోపచార, శక్త్యోపచార, భక్త్యోపచార పూజాం సమర్పయామి అనుకొని, నమస్కరిస్తూ ఈక్రింది శ్లోకమును చదువుకొనవలెను.

శ్లో॥ యస్యస్మృత్యాచ నామోక్త్యా తపం పూజా క్రియాదిషు
యానసంపూరతాంయాతి సద్యోవందే తమచ్యుతమ్

ఏతత్ఫలం శ్రీ కృష్ణార్పణమస్తు అంటూ అక్షతలు నీటితోపాటు అరవేణంలో వదలవలెను. పిమ్మట ' శ్రీకృష్ణ ప్రసాదం శిరసాగృహ్ణామి ' అనుకొని స్వామివద్ద అక్షతలు తీసుకొని తమ తమ తలలపై వేసుకొనవలెను. ఆ పిదప పసుపు గణపతి ఉన్న పళ్లెము నొకసారి పైకి ఎత్తి తిరిగి క్రింద ఉంచి పళ్లెములో ఉన్న పసుపు గణపతిని తీసి దేవుని పీఠముపై నుంచవలెను. దీనిని ఉద్వాసన చెప్పటం అంటారు.

శ్లో॥ యస్య స్మృత్యాచ నోమోక్త్యాతపః పూజాక్రియాదిషు. న్యూనం సంపూర్ణతాం యాతి సద్యో వందేతమచ్యుతం మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం జనార్ధన, యత్పూజితం మయా దేవ పరిపూర్ణం తదస్తుతే, అనయా ధ్యాన ఆవాహనాది షోడశోపచార పూజాయా చ భగవాన్సర్వాత్మకః శ్రీ కృష్ణపరబ్రహ్మణే సుప్రీతోవరదోభవతు, శ్రీకృష్ణపరమాత్మ ప్రసాదం శిరసాగృహ్ణామి అని దేవునికి నమస్కరించి ప్రసాదమును స్వీకరించవలెను.

పూజావిధానం సంపూర్ణమ్.

## కృష్ణాష్టమి వ్రతకథా ప్రారంభము

శ్రీ మునిశ్రేష్ఠుడైన నారదుడు లోకహితమునకై సత్యలోకమునకు పోయి అచ్చట శ్వేత పద్మాసనమున కూర్చునియున్న బ్రహ్మదేవుని చూచి సాష్టాంగముగ నమస్కరించి శ్రీకృష్ణాష్టమి వ్రత మహత్యము వినగోరుచున్నానని వినయముతో పలికెను. అందుకు బ్రహ్మదేవుడు ఇలా పలికెను. నారదా ! కలికల్మషములను భస్మము చేయునదియు, జయమును సుకృతమును కలుగజేయునదియు అయిన శ్రీకృష్ణాష్టమి వ్రత ప్రభావము చెప్పెదను వినుము అని పలికి జయంతినాడు కృష్ణుని స్మరించిన మాత్రముననే ఏడు జన్మల దుష్కృతములు మిగలక నిర్మూలనము అగును. ఆరోజు ఉపవాసము చేసినవారికి పాపములన్నియు నశించిపోవుననుటలో సందేహము లేదు.

ఈ కృష్ణాష్టమి పరిశుద్ధమైనది, పాపములన్ని పోగొట్టునది అయిన ఈ వ్రతమును ఆచరించినవారికి అశ్వమేథయాగము చేయగా వచ్చునంత పుణ్య ఫలమును, సమస్త తీర్థములలో స్నానము చేసిన ఫలమును లభించును. కృష్ణాష్టమి రోజున ఎవరు ఉపవాసము చేయుదురో వారు వెయ్యి గోవుల దానమిచ్చిన ఫలమును రత్నకోటి సహస్రదానఫలమును,పదివేలగుఱ్ఱములనుదానమిచ్చినఫలమును, వెయ్యి ఏనుగులను దానము చేసిన పుణ్యమును, వెయ్యి కనకాభరణములు కురుక్షేత్రమునకిచ్చిన ఫలమును, కోటి కన్యాదాన ఫలమును పొందుదురు. గురువు కొరకుగాని, బ్రాహ్మణో త్తముల కొరకుగాని, యజమానుని కొరకుగాని, దేహత్యాగము చేయునంత ఫలమును, ఆపన్నులకు ఆపద పోగొట్టు ఫలమును, తీర్థయాత్ర చేయువారి పుణ్యమును, సత్యవంతులకు కలుగు పుణ్యమును పితృ ప్రీతిరకముగ చేయు ధర్మశ్రాద్ధముచే కలుగు పుణ్యమును, ద్వాదశి తిథి పారాయణము చేయువారికి కలిగెడు సుఖమును కలుగును. శ్రీ కృష్ణజయంతినాడు ఉపవాసము చేసి, జాగరణము చేయువారికి ఈ సుఖములు, పుణ్యములు కలుగును. ఇది కూడా కాక ధర్మవేత్తలును, సత్యవంతులు అయిన అంబరీష, గాధి, శిశుపాల మొ॥గు రాజులచే ఈ కృష్ణాష్టమి వ్రతమాచరించబడినది. వారు అశేష రాజ్యము పొంది భూమండలము పాలించుచూ చివరకు ఈ కృష్ణుని అనుగ్రహము చేత వైకుంఠమును చేరిరి.ఇంకా వాల్మీకి, వాలఖిల్య, వశిష్ఠ, గౌతమ, జమదగ్ని మొ॥గు మహర్షులందరూ కృష్ణుడు జన్మించిన శ్రావణమాస రోహిణీ నక్షత్రముతో కూడిన కృష్ణపక్ష అష్టమీ దినమునందు ఈ వ్రతము ఆచరించిరి.

# శ్రీ కృష్ణాష్టమీ వ్రతకల్పము

ప్రతి జన్మయందు గల పాపములు చక్రపాణియొక్క పాదముల అనుగ్రహముచే తొలగిపోవును. ఈ వ్రతము సమస్త కోరికలను ఇచ్చునది. కావున ముకుందుని భక్తితో, ఉపవాసముండి పూజించినచో సమస్త దోషములు తొలగి అష్టైశ్వర్యములు ప్రాప్తించి కోటిజన్మ పుణ్యము సంభవించును. కృష్ణాష్టమి నాడు ఉపవాసముండక భుజించిన పాపములు వచ్చును. ఈ వ్రతమును నిందించినచో అనేక పాపములను పొందుదురు. ఓ నారదా ! శ్రీకృష్ణ జయంతి రోజున శ్రీ కృష్ణపూజను ఎవ్వరు ఆచరింతురో, వారి విషయమున దేవకీదేవి పుత్రుడై అవతరించిన పురుషోత్తమునితో కూడి సంతోషముతో నుందురు. కావున ప్రతిదినమూ దేవకీ సహితుడైన హరిని ఆరాధించు మానవులు విష్ణుపథమును పొందుదురు. ఈ జన్మాష్టమి వ్రతము చేయు విప్రోత్తములు (బ్రాహ్మణులు) జన్మసిద్ధి పొందుదురు. వాసుదేవ స్మరణచే రాజు, దైవము, అగ్ని, సర్పము, వాయువు, జలము వలన కలుగు భయములు పోవును. పశువులు, ధనము, ధాన్యములు వర్ధిల్లును ఇహలోకమున కుటుంబ వృద్ధి కలిగి అంతమున మోక్షము కలుగును. శ్రీవిష్ణు పథము పొందుదురు. రోగ దుఃఖబాధలవలన కలుగు భయము తొలగును. కలహము, ఉపద్రవము కలలోనైననూ కలుగవు. మరియు ఇంకొక విశేషము కలదు. ఈ వ్రతము రోహిణీ నక్షత్రము బుధవారముతో కూడుకొన్న దైనచో అట్టి సమయమున ఆచరించినవారికి కులోద్ధరణ, అన్నింటా విజయము కలుగును. ఓ నారదా ! ఇన్ని ఏల మాతా పితరుల (తల్లి, తండ్రి), గురువుల పూజలవలన కలుగు ఫలము కలుగును అని బ్రహ్మదేవుడు పలుకగా నారదుడిట్లు పలికెను. ఓ పితామహా ! శ్రీకృష్ణజయంతి వ్రతము ఎట్లు చేయవలయును ? దీని విధానము ఎట్టిది ? నాకు ఉపదేశింపుము అనినంతనే చతుర్ముఖుడు ఇలా చెప్పుచుండెను. ఓ నారదా ! మొదటగా సనత్కుమారుడు హరిశ్చంద్రునిచే ప్రార్థింపబడి అతనికి ఈ వ్రతమును ఉపదేశించెను. ఏ వ్రతమైననూ నియమముచే ఆచరింపబడినచో ఫలితము ఉండును. నియమము లేక చేసినచో వ్రతము శ్రేయస్సు కలుగదు. కావున భక్తియుక్తుడై, శుచిర్భూతుడై ఈ వ్రతము చేయు రోజున ఉపవాసముతో వుండి, మధ్యాహ్నకాలమున భార్యా బిడ్డలతోను, స్నేహితులు, బంధువులు మొదలగువారితోను కూడి ఇంటిలో నైనను, వైష్ణవ ఆలయములోనైనను ఆవుపేడతోనైనను, నీటితోనైనను స్థలమును శుభ్రము చేసి, ముగ్గులు వేసి, ఒక శుద్ధమైన కుండను తెచ్చి దానియందు శుద్ధ జలమును పోసి,

అడుగున బియ్యము పోసి, ఒక పీఠముపై ఆ ఘటము (కుండను) పెట్టి గంధము, పుష్పములు, అక్షతలు మొదలగు వాటిచే అలంకరించి వస్త్రము చుట్టి ఆ కలశము మీద శక్తి కొలది బంగారంచే చేయబడిన బాలకృష్ణుని ప్రతిమను (బొమ్మను) పెట్టి (శక్తిలేనివారుపంచలోహప్రతిమనుకూడపెట్టవచ్చును)యథావిధిగా పూజించవలయును. శాస్త్రోక్తముగా చేయనివారు నరకప్రాప్తి పొందుదురు. ఏ ధర్మమైనను యథావిధిగా నియమముతో ఆచరింపవలయును.దేవకీ గర్భమునుండి జగజ్జనకుడైన జనార్దనుడు జన్మించు సమయమున జాతకర్మాదులు (అనగా శిశువు జన్మించినంతనే ఆచరించు శుభకర్మలు) చేయించినట్లుగా భావించి తనకున్న శక్తి కొలది భక్తితో గోవు, భూమి, బంగారం, ధాన్యం, పండ్లు, వస్త్రములు ఇలా ఎవరి శక్తి కొలది వారు దానములు చేసి ఈక్రింది పురాణ శ్లోకములను పఠించవలెను.

శ్లో॥ అదితే దేవమాతస్త్వం సర్వపాప ప్రణాశిని
అతస్త్వాం పూజయిష్యామి భేతోహంభవ సాగరాత్ ॥
శ్లో॥ పూజితాసియథాదేవైః ప్రసన్నాత్వం వరానవే
పూజితాచయథాభక్త్యా ప్రసాదం కురుసువ్రతే ॥
శ్లో॥ యయారాత్రౌ హరిరర్థ్వా ప్రాప్తాత్త్వం నిర్వతింపరాం
తామేవనిర్వృతం దేహి సుపుత్రం దర్మయస్వమే ॥
శ్లో॥ అవతార సహస్రాణి కరోతి భగవాన్ హరిః
తేషాం చైవతుమాహత్మ్యమ్ కచ్చిజ్జానాతివై భువి ॥
శ్లో॥ దేవబ్రహ్మాదయోయేపి స్వరూపం నవిదుస్తవ
అతస్త్వాం పూజయిష్యామి మాతురుత్సంగ సంస్థితం ॥
శ్లో॥ వాంఛితం కురుమేతత్ర దుష్కృతం చైవనాశయ
కృపాం కురుష్వమే దేవ సంసారార్తి భయాపహ ॥

అను ఈ శ్లోకములతో కృష్ణుని ప్రార్థన చేసి అర్థరాత్రి సమయమున ఆవాహనాది షోడశోపచార పూజను చేసి, చంద్రుడు ఉదయించు సమయానికి బయటకు వచ్చి, అక్కడ ముగ్గులతో అలంకరింపబడిన భూమియందు పూవులు, పండ్లు, గంధం మొదలగు వాటిని, చంద్రుని కొరకు అర్ఘ్యమును, శంఖముతో నీటిని తీసుకొని (శంఖమనగా శ్రీమహావిష్ణువు ధరించునది.

ఇది సముద్రపు ఒడ్డునగాని పేరుపొందిన దేవాలయ సమీపములందుగాని దొరకును). శంఖములో కొబ్బరినీరు తీసుకొని పూజాపాత్రలైన పంచపాత్ర, అర్ఘ్యపాత్ర, ఉద్ధరిణ మొదలగు సామగ్రిని దగ్గర పెట్టుకుని క్రింది శ్లోకములతో పూజింపవలయును.

శ్లో॥ జాతః కంసవధార్థాయ భూభారోత్తరణాయచ,
పాండవానాం హితార్థాయ, ధర్మసంస్థాపనాయచ ॥
కౌరవాణాం వినాశాయ వసుదేవ కులోద్భవ
దేవకీగర్భ సంభూత, భక్తానామ భయప్రద
గృహాణర్ఘ్యం మయాదత్తం ప్రసీద పురుషోత్తమ

అను ఈ శ్లోకములతో శ్రీకృష్ణునికి ప్రీతి కలుగు విధముగ అర్ఘ్యమును ఇచ్చి ఆ రాత్రి భగవత్ కథలచే ప్రీతి కలిగించి, జాగరణ చేసి, నైవేద్యము, తాంబూలము ఇచ్చి కర్పూర నీరాజనం, గీతము, నృత్యము మొదలగు వాటిచే పూజింపగా జన్మజన్మలలోని దుఃఖములు, పాపములు అన్నియు తొలగిపోవును.

ఇంతేకాక మరునాడు స్నానము, సంధ్యావందనము శుద్ధమైన మనసుతో చేసుకొని, అనేక రుచులతో కూడిన పిండివంటలు, పాయసాన్నములు మొదలైన వాటిచే బ్రాహ్మణ, స్త్రీ, బాలుర, వృద్ధుల, స్నేహితుల, బంధువులనందరినీ తృప్తి పరచవలెను. తాను కూడ భుజించవలెను. ఈ వ్రతమును విధి విధానముగ చేయువారికి వ్రతమహిమచే దౌర్భాగ్య, వైధవ్య దుఃఖములు తొలగిపోవును. ఇంతేకాక, ఇరవైఎనిమిది కోట్ల ఏకాదశులు ఉపవాసమున్న ఫలము కలుగును. ఇంకా ఈ వ్రతమహిమచే వీణావేణుమృదంగము మొదలగు వాద్యములు కల్గియున్న విమానములను ఎక్కి గరుడవాహనముగా కలవాడైన విష్ణుదేవునియొక్క సన్నిధికి చేరుదురు. దుష్ట దేశములను పడగొట్టు రీతిన ఈ శ్రీ కృష్ణ జయంతి వ్రతము పాపములను తొలగించును. ఈ వ్రతము చేయనిచో ఎన్ని దానములిచ్చినను ప్రయోజనము లేదు.కావున నారదా ! నీవు కూడా ఈ వ్రతమును చేయుము. నిజము చెప్పుచుంటిని మొదటగా హరిశ్చంద్రుడు ఈ వ్రతమును చేసి సిద్ధి పొందెను. ఈ వ్రతము ధర్మార్థకామమోక్షములను ఇచ్చునది. ఈ వ్రతము ఒక పుస్తకముగా వ్రాయబడి ఎవరి ఇంటిలో ఇది పూజింపబడునో వారికి నారాయణ సాన్నిధ్యము కలుగును.శక్తికి తగిన విధముగా ఈ వ్రతము చేయువారు అన్ని పాపములు తొలగింపబడి సర్వ వేదములను చదివిన ఫలమును పొంది, పరమ పవిత్రమైన పురుషోత్తముని దగ్గరకు చేరుకొందురు.

ఈ వ్రతము చేయుటవలన భార సహస్ర స్వర్ణదాన ఫలము (అనగా వెయ్యి బంగారు నాణెములు దానం చేసిన ఫలము) లభించును.

ఇలా ఈ వ్రతము చేసి ప్రతిమా వస్త్రాలంకార భూషణ తాంబూలము దక్షిణాదులతో అనగా శక్తి కొలది బట్టలు, ఆభరణములు, తాంబూలము, దక్షిణ, ప్రతిమ అనగా బొమ్మ బంగారము, వెండి లేదా మట్టిదైనను బ్రాహ్మణునకు దానమిచ్చినచో ఇహలోకమున పుత్రపౌత్ర ఐశ్వర్య సుఖములన్నియు అనుభవించి చివరకు అనంతుని పాదారవిందముల వద్ద చేరుదురు. ఇలా చెప్పిన బ్రహ్మదేవుని మాటలకు నారదుడు ఆనందము పొందినవాడయ్యెను.

కృష్ణాష్టమి వ్రతకథ సంపూర్ణము